


వజ్ఝల కాళిదాసు

"భిక్షావళి"ని

భాషాప్రవీణ ప్రవేశ పరీక్షకు
పఠనీయముగా నియమించిన
ఆంధ్ర విశ్వ విద్యాలయమునకు,—
"మెట్రిక్యులేషన్" పరీక్షకు
పఠనీయముగా నియమించిన
ఉత్కళ విశ్వ విద్యాలయమునకు,
ఇంటర్ మీడియట్ పరీక్షకు
పఠనీయముగా నిర్ణయించిన
ఉస్మానియావిశ్వవిద్యాలయమునకు
నాకృతజ్ఞత.

— వజ్ఝల కాళిదాసు.

ప్రతులకు

వఝల కాళిదాసు

ప్రవాసి సంపాదకుడు

జాంషెడ్‌పూర్.

( బీహార్ )

ముద్రణ

మోడల్ స్టేషనరీ అండ్ ప్రింటింగ్ వర్క్సు

సాక్చి — జంషెడ్‌పూర్.

## భిక్షావతి. ౧.

ఆకలి మంట నాకడుపుటంచుల దాటి దహించు నేమియున్
జేకురదాయెఁ; జల్లనగు చేతులనొక్కఫలమ్ము, యేదియో
యేకరుణైకమూర్తియును నీయఁగఁజాలఁడె? క్షున్నివారణో
చ్ఛోకమె జన్మసిద్ధియనుచున్ విలపించెడు దీనురాలికిన్.

కడుపునఁగన్న యొక్కపసికందు క్షుధాగ్ని సహస్రకీలలన్
బడి, కొనయూర్పుతోఁ దెలుపు వారిన నెత్తురులేని మోముపై
ముడుతలతోడఁ గన్నుఁగవ మూఁగఁగఁ బల్కెడు నశ్రుమాలికల్
జడిగొననుండె, నేకడుపు చల్లని తల్లియు బ్రేమచూపదో!

ఉపసికాన ప్రాణముల నిచ్చినవారలుగా, మదీయ సం
శోకమయాంధ జీవిత సుధాకరమూర్తులుగాఁ దలంతు, మీ
రోపినయంత యింత యిడుఁడోయి మహాత్ములు, పూర్వజన్మదు
ష్పాపవశమ్మునన్ గరము సాచుచు వేడెడు బిచ్చకత్తెకున్.

వెలుతురులోనఁ గన్నులను విప్పిననాఁడె నశించెఁదండ్రి, యా
పరిశయము నాఁడుగాఁ బుడమిపైఁగల యాశలవెల్లఁ బూర్తిగా
దళితములయ్యె; నెన్నడును తారలురాని యనంతరాత్రిగా
నిలుచునుభావి మాయెదుట, స్నిగ్ధమతుల్ గరుణింపుడీమమున్.

తిరియుదు వీధివీధులఁ బ్రతిక్షణమున్ నడిరేయిదాక నె
వ్వరయిన నింతయన్నమును వైచెదరేమొ యటంచుఁ, గానియా
తురపడు నన్నుజాలికనుదోయిఁ గనుంగొనువారె లేరు—ఏ
కరణి శమించు నాకడుపుఁ గాల్చుక్షుధాగ్ని సహస్రకీలికల్.

మునుపడు నాదరిద్రమెటు పోవగ నెంచిననాకునియ్యెడన్
దినుటకుఁదిండి, నిల్చుటకునీడ, ధరింపఁగ బట్టలేవు; నా
యనుకొన నొక్కఁడీశిశువె యంతయుఁగాఁదనిపోవునాకు నే
జననియుఁ బెట్టెడన్నము నొసంగఁగఁ జాలనొ సత్కృపాత్ములై.

అలమురు దాసనా పిడికెడన్నము చాలక చావునోటికిం
పలఁ బడిపోవునాదు పసిపాపనిఁ జూచి; కరాళరాత్రిగాఁ
దలపుల కంపునాదు భవితవ్యమునెంచి వ్యధన్ వహింతునా—
విలవిలవోవుమమ్ముఁ గనిపెంచిన యే యమమైనఁజూడదో!

## భిక్షావతి

రేవగ లాసమాయెఁగ, దరిద్రకరమ్మది చాచినట్లు మో
డై వివశమ్ము కావలయు నంతియె, బీదయెలుంగు శూన్యమై
పోవలె నంతెకాని యెటుపోయిన నెంతని మొఱపెట్టినన్—
ఈ వెలి వడ్డజీవిత మొకించుకఁ జాలిఁ గరంచఁజాలునా?

కాలమహోరగమ్ము నురగల్ వెలిగ్రక్కుచు, రెండురెండుగా
జీలిననాలుకల్ - వెలుగుఁ జీకటిగా - మెలివెట్టి మాదు ప్రా
ణాల గ్రసించుచున్నది క్షణక్షణ మాసలు మారిపోవఁగా;
జాలి, సుధాన్నమేకడుపు చల్లని తల్లియు నీయఁజాలదో.

వైభవభోగముల్ కనులపైఁ దెర గప్పిన వేళ నెన్నఁడో
యేభవమందు నావలెనె యేడ్చినవారికి నీయకుంటినో
యీభవమందు నాకలికి నింతని కుందుచునుంటి; భావిపూ
ర్వోభయకాల విజ్ఞులకు నూహలకందు దరిద్రమత్కథల్.

ఆంగద పిచ్చలింప వినయంబున వేఁడెదు నాయెలుంగు ని
ష్ఠ్రుం గరగింపఁజాలదొకో—మూఁడుదినమ్ముల క్షుత్తుకండ్లలో
సంగనుపింప, శుష్కవదనంబున నారటమావరింపఁగాఁ
గుంగిన చిన్నిబిడ్డఁ గనుగొందు కృపాకలితైక మూర్తులై.

తికమకలాడు సంగములు తిండికినై యడియాసకానికో
రిక నశియించుప్రాణులుదరిద్రతమోంగణ వీథినుండి వే
డుకొనుచున్న వారలు కడుంగను దీనముగాఁగ, మమ్ముఁజూ
చి కరుణతోడ నేదొ దయసేయుడి యాకలితీర్చుకొంటకున్.

దళితాశా కుసుమమ్ము, లాతపవిదగ్ధ ప్రేమ భావాంకుర
మ్ములు, వాతాహత సౌఖ్యపత్రములునై భూకంపకల్లోలఘో
షలదారిద్ర్యమునిండి నాబ్రతుకువృక్షంబల్లనన్ గూలె, నే
ప్రళయంబోయిక నేల, నారకగతుల్ ప్రత్యక్షమీభూమి నే

కడుపును భగ్గుభగ్గుమని కాల్చుచునున్నవి మంటలెట్లు గా
నడగును, భావిభూతనిశితాకృతి చూపులనుండి యేగతిన్
దుడుచుకపోవుఁ, గంటకతతుల్ తెగనిండినజీవితమ్మునన్
విడివడుటెట్టులన్ రుచులనింపుమనోజ్ఞతరప్రసూనముల్.

పరుషమ్ముల్ వచియింతురేమిటికిఁ, గోపస్ఫూర్తికళ్లెఱ్ఱసే
తురదేలా, నవమందహాస చకితోత్ఫుల్లమ్ములౌకన్నులా
కరణిన్ ద్రిప్పెద రేల, మాకడుపులోఁ గార్చిచ్చుగా రేగును
ర్భరమౌ క్షుత్తునఁబెట్టుమా మొరలు చేరన్ లేదమీకర్ణముల్

రెక్కలులేని పక్షులు భరింపఁగఁ జాలని గాలితాకునన్
దిక్కులు గానకుండ జడిగతిన్ గడుపున్ దహించు నాకటన్
జొక్కుచు నాస వెట్టుకొనుచున్ విలపించుచు నున్నయట్టి మ
మ్మక్కటి కమ్మునిండఁ గని ప్రాణములన్ దయచేయుఁడీ ప్రభుల్.

అసువులు తాళలేవు తుదియాకలియే యిదియేమొ, యింత వె
క్కసమగు హీనజన్మమును గాంచుట లేభవ పాపముద్రనో;
విసమును మ్రింగి ప్రాణములు వీడుకుమన్నను, లేతగ్రుడ్డు నా
నిసువు, భరింపలేదు జననీ ప్రణయమ్మొడబాటు మాటనే.

బ్రదుకఁ బెడారిలోఁ దిరుగు పాంథుల మేమిటుఁ, గానిమాకుఁ దో
చదు మృగతృష్ణయేనియును సంతసమున్ క్షణమైనఁ బొందఁగా;
ఎదురుగ నిల్చు నిత్యమొక లే పెనుభూతము నోరువిచ్చి మ
మ్ముఁ దినుటకో యనన్; తరుగఁబోవునుఁడీ దురదృష్టమత్కథల్.

నావిధి యొక్కలే బ్రతుకునన్ ననునిల్పుచు నున్నదైన నా
శావధి నాకునయ్యెడె, సుఖాంతముగాఁ బరిణామమందఁగా
దేవుని వేడుకొందును ప్రతిక్షణమున్ "బసికందు నాచిరం
జీవిని పెద్దసేసి మరణింపఁగ నీయుమన" న్నటంచెదన్.

కెవ్వుమటంచు నానిసువు కేకలు వీనులయందు సోఁకఁగా
నెవ్విధినిల్పుఁ బ్రాణము, లోకించుక జాలివహించి యీయరో
యెవ్వరు నొక్కకాసియు; నదేపదివేలుగ, మృత్యుదృష్టిదా
దవ్వుల నున్నవారి కమృతమ్ము నొసంగిన రీతి నెంచెదన్.

కాలముగిర్రునన్ దిరుగుఁగాని క్షణమ్ము యుగమ్ముపోలికన్
గ్రాలుచుఁదోఁచు మాకడుపుఁ గాల్చుచు నాకలిచిచ్చు రేఁగు నీ
వేళఁ బ్రపంచమెల్లఁ బదవీచ్యుతి బొంది త్వరన్ గభీర పా
తాళము చేరుచుండెను విధంబునఁ దోఁచుచునున్న దియ్యెడన్.

ఇంతగనేడ్చు మామొఱల నెవ్వరు వీనులఁ జేర్పరేల, యా
వంతయు జాలి చూపులనైననుఁ జూడరదేల, చూచినన్
స్వాంతము రాయిచేసుకొనినట్లుగఁ బోయెదరేల—లేదయా
గొంతుకకోఁత లోకమునకున్ వెదుకన్ గరుణాలవాంశమున్.

మీరు మహానుభావులరు మీనడయాడిన త్రోవలందు మా
తీరునఁ బొట్టచేతఁగొను దీనులుపాదమునైన నిల్పఁగా
లేరు, నభఃపథంబున వెలింగెడి చుక్కలు మీరు, మేమధో
నారకగర్భజీవుల మనన్ మరిమాగతి యేమిచెప్పుదున్.

జీవితమెల్ల భగ్నమయి చీఁకటి పాలయి పోయినట్టి భి
క్షావతియైన యాయబల సాచిన యాకలిచేయిశూన్యమే
ప్రోవులువేసెఁ; జాలితలఁపుల్ కదలించెడు నామెయేడ్పు శూ
న్యావసథమ్ముఁ జొచ్చినది, యామెకు సర్వము నింకశూన్యమే.

ఆభిక్షావతి పొట్టచేతఁగొని హా! హా! యంచు జ్వాలాక్షుధా
క్షోభాకంపిత మూర్తియై కరుణకున్ జోహారులన్ జేయు నా
శాభావంబునఁ, జూడరెవ్వరును, విశ్వమ్మెల్ల కాఠిన్య కాం
తాభాయిష్టమొ లేక జాలిలవలేశమ్మైన లేదో భువిన్.

వెలుఁగున్ జీఁకటు లేకమై వెలయునావేళన్ రహస్యమ్ముగాఁ
దలపోతల్ పరికించుఁ గష్టసుఖసాదృశ్యమ్ముగాఁ, గానియా
విలసీలాంధనిశీతమఃపటలి యావిర్భావమున్ జెంది యే
వెలుగున్ రేకనుఁ జేరనీయక భువిన్ విశ్రామమున్ జెందునో.

ఆమలిసంజవేళ నరుణారుణ కాంతులు పశ్చిమంబునన్
బ్రాముకొనన్ గరాళమగు రాతిరి రక్కసినోటియందునీ
భూమిపడన్ స్రవించిన కవోష్ణపు నెత్తురుధారలంచు నే
నోమలినంపుఁ బోలికలె యూహలకందిన నామెకన్యెడన్.

దారిద్ర్యాసుర ఘోరదంష్ట్రికలనంగాఁ దారల్ నభోవీథి వి
స్ఫారెన్, వైద్యుతదీపపాళి త్రిదివాశాంతంబులే వెల్గగా
బారుల్ బారులుగా వెలింగినవి విభ్రాజోజ్జ్వలత్ చంచలా
కారస్ఫూర్తి, శివాలయాన మొరసెన్ ఘంటారవాంకారముల్.

ఆఘస్రాంతమునందు సర్వమును నూహాతీతమై తోచి యే
దో ఘోషన్ వెలిగ్రక్కుచుండెఁ, బురవీథుల్ చిత్రచిత్రాకృతి
శ్రీఘట్టమ్ములు వోలెనుండె ఘటనాసృష్టిప్రకారమ్ము — అం
దా ఘంటారవ మొక్కటే మొరసెఁ బ్రత్యాసన్నమై యామెకున్.

ఆశివాలయ ఘంటారనాంతరమున
నాత్మకున్ మాత్రమందు నాహ్వానమేమి
యిమిడియున్నదో, యాశయో యేమొకాని
యామె పదములు నడచెఁ దమంత నటకు.

### భి క్షా ప త్రి. ౨.

గంభీరంబులు, పూర్వవైభవ
కళాఖండంబు, లాశ్చర్యసం
రంభద్యోతకముల్, శిలామయము,
లార్యావర్త శిల్పప్రభా
జృంభ[illegible]సటనా ప్రదేశములు,
ప్రాచీనోరు దేవాలయ
స్తంభంబుల్ గనిపించె వత్సర
సహస్రప్రాయ నిక్షేపముల్.

గ్రావాకల్పిత కుడ్యము
లావిద్ధ పురాణ సత్కథాంచిత బహుచి
త్రావిష్కృతములు, శిల్పక
ళావిష్కృతమ్ములు, పురావిలాసస్ఫుటముల్.

మలకన్న వలపుకోర్కెలు నిండగాఁగాఁడ
యండలం దిరుగాడి నట్టికతలు,
ముక్కంటికోపానఁ బూవిలుకాఁడు చ
య్యననింత బూడిదయైన కతలు,
జడలోన మిన్నేటి వడినెల్ల పులితోలు
దాల్పువిరిపిన యందాలకతలు,
వెలదివేసమునఁ బూని వెన్నుండు జడదారి
వలపుశీలంపు దొంగిలిన కతలు,

కారుచీకటి రేయిఁ జుక్క లవి నవ్వఁ
బుర్రెలన్ దాల్చి సంతసమున మునింగి
శివుడు ప్రళయతాండవమును చేయుకతలు
చిత్రముగ రాతిగోడలఁ జెక్కఁబడియె.

క్షీరసాగరములో శ్రీసతీసహితుఁడై
పవ్వళించిన లోకపాలకుండు,
యమునాతటంబుపై యదుబాలికాహాస
లీలలందేలు గోపాలకుండు,
దండకాటవిని సీతాదేవితోఁ బర్ణ
శాలనుండిన రామచంద్రమూర్తి,
సుప్తిమున్గినసతీ సుతులవీడుచుగుండె
రాయిచేసుకొను సర్వజ్ఞమూర్తి,

యీ విశాలకుడ్యమ్ములయందుఁ జిత్ర
ములుగ, జీవకళాపూర్ణములుగ, శిల్ప
జీవములుగ హైందవ యశశ్చిహ్నములుగ
సక్కజముఁగొల్పు రీతులఁ జెక్కఁబడిరి.

యౌవన మనోజ్ఞపూర్ణావయవ సహితలు
భావభంగిమాప్రణయ విభ్రమవిలాస
లప్సరః కామినీ స్వరూపాంచితలగు
నంగనల నగ్నచిత్రము లందుఁ గలవు.

ఏశకమందు నెవ్వాఁడవి
సృష్టియొనర్చెనో, నానికీర్తియా
శాశలఁజేర శాశ్వతమ్మునై
యవి కన్పడెఁ, జూచువార లా
వేశిత చిత్తులై కరము
విభ్రమమంగన గోపురమ్ము లా
కాశముఁ జేరఁ బోవునటుగాఁ
గనిపించె మహోన్నతమ్ములై.

కన్నుల భక్తిసంభ్రమము
గాఢము గా, హృదయాన వాగతీ
తోన్నత భావముల్ వొడమ,
నూహాల వేరుస్మృతుల్ నశింప నా
పన్నులు బీదలందరు
సమానముగా నడయాడన్నైన యా
తెన్నన నామెయొక్కతెయె
దేవునిప్రేమకుఁ బాత్రకాదొకో !

సవిలాసముగఁ బోవు యువకుండొకండామె
నాపాదమస్తక మరసిపోవు,
మడిబట్టలన్ గట్టి నడుచువాఁడొకఁ డామెఁ
జూచినయంతఁ గస్సుమని లేచుఁ,
బాలుబండ్లన్ గొని పోవువాఁడొకఁ డామెఁ
గనిసంత వెక వెక మనుచునవ్వు,
విశ్వస్తమొకతె నివేదితవస్తువుల్
దెచ్చుచు నామెనుఁ దిట్టిపోయుఁ,

బడుచులున్ జిన్నపిల్లలు పకపకనగి
రామెదెసనైనఁ జూడక యరుగువారు—
ఆశివాలయకుడ్యమ్ము లాదుఁగలుగు
శిలలె కరుణకు సుంతైనఁ జెమ్మగిలును

ఎడఁదలోనిమాట తడఁబడుఁ బెదవులఁ
గడుపుఁగాల్చుచిచ్చు కనులమెరయుఁ;
దల్లిప్రాణముబికి తల్లడిల్లునుమదిఁ,
గఠినలోకమునకుఁ గరుణ లేదో?

పువులనుగోసి తెచ్చి శివపూజయొనర్చెడు వారలందరున్
ౘవిమలపుణ్యశాలులొకొ, ప్రత్యహమూలయ సీమకేఁగుమా
నవులు పవిత్రులా, సతమునైష్టిక కర్మల జేయువారు భ
క్తవరుల, మానవప్రథమ ధర్మము జాలియె లేకపోయినన్.

శిలకు నమస్కరించెదరు.
జీవితరాగము సంగ్రహించి యా
శిలయె మనుష్యశక్తిఁ బరిశీలన
చేయఁగఁబల్కెనేని, వి
హ్వలులయి, భూతమో
కపటభాషణమోయని పారిపోవు వం
దలుసుమి వీరలందరును
నాస్తికులే హృదయాంతరంబునన్

ఒక్కరొక్క రెపో నాడు చున్నఁగాని
యాశహృదయాన నెంతో కొట్లాడుచుండె
వినువుచెందక వేడునా బిచ్చకత్తె
యొక్కరికినైన జాలిలేకున్న యనుచు.

రాతిగుండెల మనుజులు రాతిదేవు
కరుణఁజూరగొందురు పూజఁ, గాని తరుణి
యొకతె కడుపుమాడగ వేఁడుచుండ జాలిఁ
దలప రింతకాఠిన్యంబు కలదె ధరణి !

ఆకఠినత్వమున్ గని నిరాశ యగాధతరమ్ముగాఁగ న
స్తోకవిచారమంతయును దూరముగాఁ జన "నొక్క పెట్టు నీ
లోకమునంతయున్ క్షణములో కబళించిన—" నంచు నేవియో
చేకురరాని కోరిక లశేషములైనవి యామెకయ్యెడన్.

ఎవరది యామె భావములనెల్ల
నెరింగినవారు వోలె లే
యుపురుల మీరు బుగ్గలపయిన్
జిరునవ్వులు చెంగలింపఁ గ
న్గవనమృతోపమాన కరుణా
కిరణమ్ములు ప్రజ్వరిల్లగాఁ
బువులును పండ్లు నామెకిడఁ
బోవుచునుండిరి లేతచేతులన్.

చివురుపాదములపైఁ జిన్నారి వెండిము
వ్వలు ముద్దుగా ఘల్లుఘలుమనంగ,
మొలత్రాటనన్ ప్రేలుమురిపెంపు బంగారు
బిళ్లక్రొంబసుపులే వెలుఁగులీన,
శ్రీకారములఁబోలు చెవులకు నీలాల
లోలకుల్ క్రొత్తయందాలనీయ,
నర్ధచంద్రాకృతి నలరారు నుదుటిపై
నంగారుబొట్టు విన్యాసమమర,

ముంగరాలకురులఁ దాల్చియున్న పూలు
రంగురంగులు, క్రొత్తసౌరభములీన,
నాలుగేండ్లు నిండని పసిబాల యొకతె
వారికడనిల్చెఁ గరుణావతరమనఁగ.

చక్కఁగనైనఁ బల్కుటకుఁ జాలని బాలికయామె, నెంతగా
నక్కటికమ్ము లేఁత హృదయంబునఁ గల్గెనొ కాని, పూలుపం
డ్లొక్కటిగాఁగఁ బట్టుకొని "ఊఁ, ఇవిఇంద" యటంచుఁ జేతులన్
మక్కువఁజాచె, నామె కరుణాధనమంతయు నిచ్చునట్లుగన్.

ఆకరుణాకుమారి యిడునట్టి ఫలమ్ములుఁ బూలుఁజూచి చి
త్రాకృతి నిల్చిపోయినది యాకలివేగు దరిద్రురాలు; కా
నీ, కలనేనెరుంగదు సహింపఁగ జాలని క్రౌర్యమూర్తియై
యాకడగండ్లలోకము వహించు మహాకఠినస్వరూపముల్.

ఇనుపచేతుల నాబాల వెనుకకీడ్చి
కఠినదృష్టులతోడ భిక్షావతిఁగని,
"మెల్లిగామంచి మాట్లాడి పిల్లవస్తు
వులహరించుటకా' యని పలికెనొకతె !

అంతనాబాల తలిదండ్రు లటకువచ్చి,
తమ యదృష్టవశమ్మున దక్కెఁబిల్ల
యనుచుఁ దలఁచి యామెకుఁ దమ యభినుతులిడి
బిచ్చకత్తెను నిందించి వెడలినారు.

లలితమనోజ్ఞలోచనములన్ జలమూరఁగ నెర్రవారి చె
క్కులు కసిగంద, వెక్కుకనుగొంచుఁ జనెన్ బసిపిల్ల; అన్నికో
ర్కులు నశియింప నిందతుదకున్ బడి స్థాణువువోలె నయ్యెడన్
నిలచెను బిచ్చకత్తె మరణించుటయే సుఖమన్ తలంపుతో.

విధియొకవింతశక్తి, యరవిచ్చిన పూవుల నూడ్చిరాల్చు, గ
ర్వధనమదాంధులన్ బహుళ భాగ్యపరీతులగా నొనర్చు, మా
నధనులఁ గష్టశూలములనాటు, నమాయకులన్ నిరంతర
వ్యధలకుఁ బాలుసేయును, దురాత్ములకిచ్చు మహోన్నతస్థితుల్.

చీఁకటిరేయిఁ జుక్కలరచించు నదెవ్వఁడు, చంద్రబింబశో
భాకమనీయ రూపమునఁ బ్రాముని దెవ్వఁడు నల్లమచ్చ, మా
ధ్వీకమునందు చెమరచు తీపుల నెవ్వఁడు చేరుచున్, గులా
బీకుసుమమ్మునం దళుకు వెల్గులరంగులు పూయునెవ్వఁడో !

కారుమొయిళ్ళనే మెరుపుగ్రాలును, బొగ్గులయందె రత్నముల్
చేరును, కంటకమ్ముల వసించును పువ్వులు. మట్టియందె బం
గారముపుట్టు, వారినిధి గర్భమునన్ జనియించు ముత్యముల్,
క్రూరఫణాగ్రమందు దొరకున్ మణి; సృష్టిగతుల్ విచిత్రముల్.

# భిక్షావతి. 3.

వీణియ తీగ మీటువలె "బిచ్చము, ఆకలి" యన్నపల్కు పా
షాణమునేన్ గరంచుటకుఁ జాలియు, మానవుఁడే కృపాదరి
ద్రాణమనస్కుఁడై తిరుగు దారుణకాలము వచ్చెనంచు, ని
ద్రాణతనున్న లోకమును దాఁటి చరించె నభోంగణమ్మునన్.

ఆకసమ్ముమీఁద నామాల వెల్గెను
తార యెడఁద నేమి తల్లడిలెనో
చెమ్మగిలిన కనులఁ జిమ్మచీఁకటిఁ జీల్చి
కొనుచుఁ జూచి జారెఁ గొండవెనుక.

అదరున్ గుండెలు భీతిచేఁ గరములల్లాడున్ మరుత్ స్పర్శకే,
పదముల్ దొట్రిలుఁ జీఁకటిన్ నడువఁ గంపంబందు సర్వాంగముల్
మదినారాటము హెచ్చుఁ గన్నుఁగవ చెమ్మల్ దేరు; దాతృత్వమున్
వెనుకన్ బోయెడు నా మొకా పథమునన్ వేర్వేరు భావంబులన్.

చరణములేమొ ముందునకు సాగుచు నుండెను, నాల్క బిచ్చమం
చరచుచునుండెఁ గన్నుఁగవ యంతకు నంతకు దట్టమైన యం
ధరజనిఁ జూచుచుండెను పథమ్మును; కాని మనస్సదెల్ల ని
ద్దురయొడి సొమ్మసిల్లిన సుతున్ విడనాడదు బిచ్చకత్తెకున్.

ఆ సందుగొందులం బడి
యాసలు ప్రిదులంగఁ దిరుగు నామెకు నాఁడే
'కాసి' యయిన వెరువదు, సుతు
కోసము తిరుగాడు సంత కోరిక తోడన్.

పిలచెద రేమొ జాలిగల ప్రేమపుఁదల్లు లదెవ్వరైన సం
చలసట లెక్క సేయకయె "అన్నము, బిచ్చము, సొమ్మసిల్లె నా
కలికి భరించలేక పసికందు, కనుంగొనుఁ" డంచు వేయినా
ల్కల విలపించె నాయబల గాటపు రాతిరి గుండె వ్రీలఁగన్.

పురమదంతయు నిద్దుర మునుగుచుంట
నచట నచటఁ దిరుగు వరాహములఘుర్ఘు
రములు, చలికాగలేక దూరమున జంబు
కములు కూయుట, నామెకుఁ గలిగె భయము. తిగ ఖి.

తూరుపు దిక్కునన్ శశిగతుల్ చిరువెల్గులు వోలెఁదోఁచె గం
భీర నిశావగుంఠనము వీడఁగఁ దీయుచు మెల్లమెల్లగా;
నారెను దీపముల్ మెరపులట్లుగ గప్పున, నామెకండ్లకున్
ఘోరతరాంధకారము గూర్చుచు నొక్కక్షణమ్ముమాత్రమే.

ఆ క్షణమందు బుద్ధిగతి కందని దేదో భయంబు పుట్టఁగా
వీక్షణమాలికల్ పథము వెన్కకుఁద్రిప్పి కుమారుఁ బ్రేమసం
రక్షణ కక్కునందదిమి, భ్రాంతి యటంచు యథాగతిన్, మనః
ప్రేక్షణ చంచలత్వములు వీడఁగ నాయమ ముందుగాఁ జనెన్.

ఆ పథము పంకమయము, శూన్యంబు, పగలె
పాడు వడిన యాదారిలోఁ బాదములిడఁ
బ్రజలు వెరతురు, కేవలభాగ్యశాలు
లైన వారికి నది చూడనైనరోఁత

అతిదరిద్ర దేవీ కఠినాంక సీమ,
ఘోర దురదృష్ట మోహినీ కుటిల చుంబ
నముల, లక్ష్మీకుపిత దృష్టినవయునట్టి
పుడమి బిడ్డల కావీధి పుట్టినిల్లు !

రాచబాటల, మధుర సౌరభము జల్లు
పూల తోటలలో, సౌధముల వసించు
వారి కందని మొర బీదవారి చెవులఁ
బడునె? చూరఁగొనునె యన్నమిడెడు జాలి?

అంతట నెవ్వరో పిలిచినట్లుగఁ దోఁచ ధ్వనిన్ గ్రహించి యా
ప్రాంతముఁ జేర మెల్లమెలఁ బాదములీడ్చుచుఁ బోయెనామె యే
కాంతముగా హృదంతరము నందలి భావము లొక్కమారుగా
దొంతరలై విషాదపు శ్రుతుల్ వినిపించిన వామెకయ్యెడన్.

చీఁకటిలోన దట్టమగు చీఁకటి పోఁతఁగ బోసినట్లుగా
నాకృతి ఘోరమై వికటమై కనిపింప; గఠోర కర్కశం
బై కఠినాట్టహాసము భయంకరమై వినిపింప; నిల్చె మా
ధ్వీక రసప్రమత్తుఁడొక భీకరమూర్తి కృపాదరిద్రుఁడై.

ఆ నృశంస స్వరూపుఁ గన్నంత నామె
యొడఁద కదలిక యొక క్షణమే నిలచెను;
పీడకల గనినట్లుగాఁ బిల్లఁడొక్క-
పెట్టుగా నేడ్చెఁ దల్లిని బిగ్గ బట్టి.

ఇనుప చేతుల తోడ నాదనుజుఁ డామెఁ
బట్టుకొన వచ్చెఁ గనులలో వాంఛ మెరయఁ
దళుకు లేవెలుఁగుల నీను కలికి చుక్కఁ
గ్రమ్మివేయు వినీల మేఘమ్ము వోలె !

ఆమె కనుల నాసమయంబు నందు నిలచి
యున్న బాష్పకణమ్మారి యుదధి గర్భ
గత మహా బాడ బానలా ఖండ చండ
దీప్త రేఖ వెలింగె నుద్రేక వశత !

ఆ వేగంబున మించి భావతతి యుల్లాడంగఁ గోపోద్ధతం
బై వక్షంబు చలింప ధీరమతియై యాభీల పాపౌఘ శి
క్షా వైయాత్య విశేష కాళివలె భిక్షాపాత్రతోఁ గొట్టెఁ బూ
ర్ణావేశంబున నామె వాని శిరమం దాత్మావనౌత్సుక్యయై.

ఆత్మ శక్తికి రాక్షసంబైన శక్తి
నిలువఁ గల్గునె; వెలుగు వెన్నెలల రాత్రిఁ
జీకటులు గనిపించునే? చిత్తశుద్ధి
పచ్చకత్తెకు నొసఁగె నవేద్యశక్తి.

వెండి చాయలు పుడమిపై వెల్లివిరియఁ
దూర్పు దిక్కునఁ జంద్రుఁడు తొంగి చూచె
నబల శక్తికి దేవత లభినుతించి
పంపి యున్నట్టి బంగరు పతక మనఁగ.

దూరమునఁగల పువ్వుల తోఁట నుండి
సుమ పరీమళ మరుదంకురములు వీచె;
విపుల నీలతరాకాశ వీధినుండి
చిన్న నవ్వులఁ జుక్క లాశీర్వదించె !

ఏ యతిలోకశక్తి భరియించును లోకము, సృష్టిచేయు నే
చేయి, మనుష్యులందరును చేసెదు వానికి సాక్షు లేకనుల్,
పాయనిశక్తి సర్వమును పాలన జేసెడు నేది; యన్నియున్
మాయఁగజేయు నేది; యది మానవ ధర్మము దృష్టమంతటన్.

## భిక్షావతి. ౪.

అది మహాశివరాత్రి సభోవనులను
ఏకముగఁ జేయు చీఁకటి నినుమడింపఁ
జేయు చుండెను పర్వతశ్రేణి వోలె
నలముకొని వచ్చు కాల నీలాంబుదములు.

ఆకాశంబున దిక్కులన్ బుడమియుం
దంభోనిధిన్ గ్రమ్మె సూ
చీ కోణాంచల భేద్య గాఢములు
రాశీభూత భూతాకృతుల్
శ్రీకంఠ ప్రమద ప్రదమ్ములు నిశా
సీమంతినీ కైశికా
నీకంబుల్ బహుళాంధకార సమితుల్
నీహార నీరంధ్రముల్.

అంబుదంబులు గజ సమూహంబు గాఁగ
దళుకు మెరుపులు మెరుఁగు దంతములుగాఁగ
నశనిపాతముల్ ఘీంకృతులై యొసంగ
నింగి తోఁచెను గజ యుద్ధరంగమనఁగ.

ఆ రేయిన్ గకుబంత గహ్వరములం
దావిర్భవంబంది, నీ
హారాద్రిస్థిత శైత్యపూరితములై
యాభీలతన్ వీచె దు
ర్వారోదగ్ర తరావిలంబిత మహా
ప్రస్థాన నిష్ఠ్యూత సా
ధారామాచల వృక్ష మూలములుం
రంహాశ్శక్తి వాతూలముల్.

చామీకర కాంతి యుత
ద్యోమణ్యంశు శకల తటి దుజ్జ్వలములు రే
ఖామాత్ర క్షణదీప్తిక
ళా మోహనరూప చంచలా తతి మెరసెన్.

వాతోద్ధూత వియత్పథాగత మహాంభఃపూరి తానేక జీ
మూతోరు భ్రమణ ప్రభూత చపలాభ్రూభంగవిక్షేప సం
భూతాగ్న్యుజ్జ్వల మాలికా నికర సంపూర్ణోగ్రముల్ మ్రోగె ని
ర్ఘాతమ్ముల్ ప్రకృతిప్రపంచ కుపితాఖండైక నిర్హ్రాదముల్.

ప్రళయ కరాళదంష్ట్రికల రాపిడిఁబుట్టి, మహాబిలోద్గత
మ్ములయి తటిల్లతా స్తనిత భూరి మహారవ పూరితమ్ములై
కలియుగ భీషణాంత లయకాల పురాగత ఘోరలాంఛన
మ్ములయి ధ్వనించె చండతరముల్ బహుళాశని పాత జాలముల్.

కకుబంత స్థిత మాతం
గ కృతోద్ఘీంకృతులో, యంధకారాసుర భూ
రికఠోర హాసములో శివు
నకు భూతము లిడు జయవచనంబులో పిడుగుల్.

ఒక మెరుపు జిగ్గుమనినంతఁ జకిత యైన
రాత్రిరాక్షసి మరియు నీరంధ్రమైన
నలుపు చాయలఁదేరు; శూన్యమ్ములైన
దశదిశల్ ఘెల్లుమనును శతఘ్నులట్లు.

ఆకసమ్ము చిల్లులు వడినట్లు గంగ
ధారలై నేలఁ బడుచుండె ఘోరమనుచు;
పథములన్ నీరు కడునిండి పాయలైన
యొక మహాప్రవాహము వోలె నొప్పుచుండె.

ఆ శివరాత్రివేళ శివుఁడాడెడి తాండవకేళి నిస్తులా
వేశభరంబునన్ జడలువీడినవేమొ, యనంతమైన యా
కాశమునిండి పెల్లుబికి క్ష్మాతలమంతయు ముంచివైచె గం
గా శతభంగమాలిక లఖండతరమ్ముగ నేకధారగా !

ఆతుపానుగాలి కఖిల ప్రపంచక
మల్లలాడిపోయె; వ్రేళ్లు కదలి
పోయి వృక్షములు సమూలంబుగా నేలఁ
గూలె; సర్వజీవకోటి బెగడె.

విరుచుకొని వచ్చు నామహా వృష్టి యందుఁ
బుడమి యొక చిన్నపడవయై మునిఁగిపోవు
నట్లుగాఁ దోఁచె; సంద్రములన్ని యేక
మైనగతిఁ బుట్టె భీకరమైన గోల.

వర్ణితంబైన యింత తుపాను ఘోర
మంద రనుభవించుట లేదు; అన్నమింత
కొఱతవడి మృత్యువదన గహ్వరము సంచుఁ
బడు సుతుఁగను భిక్షావతి యెడఁద తప్ప !

తన రక్తము, తన ప్రాణము,
తన చనిస సుఖమ్మునకుఁ బ్రథానాంకమ్మున్
తన సర్వస్వమ్మునుగాను
తనయునకై తల్లి యెంత తల్లడ పడునో !

వాయుహతిన్ బయోధి శతభంగములై బహుళారవమ్ములన్
జేయును; మాతృచిత్తమునఁ జిచ్చులు రేపును చావు నోటికిన్
బోయెడు బిడ్డ—తల్లి వలపుందమకంబు మహాగభీర, మా
తీయఁదనమ్మునన్ విసము తేనియ సంపదలన్ గ్రహించుఁగా !

కాణి కరవైన యొక బిచ్చకత్తెకైన
రాజ రాజాధిరాజ శిరః కిరీట
రచిత మణిమండిత పదయా రాజ్ఞికైన
తల్లి వలెఁ గోర్కె తీరునే తనయుఁ గాదె !

ఆ పసికూన తల్లి హృదయమ్మున రేగెడు మంటగాని, సం
తాపముగాని, క్రమ్ముకొను దారుణమైన తుఫానుగాని, యూ
హాపని చింతఁగాని యెటులూహయొనర్పఁగఁ జాలు, మృత్యు పా
శాపహృతమ్ము జీవితవిహారము లేదు తదంగ భంగులన్.

అరవిరిఁ ద్రెంచి హాయి హృదయమ్మున కద్గును మానవుండు ని
ష్ఠురముగ; తల్లిప్రాణమును శోకదవానలమందుఁ గాల్చుచున్
జిరుత కుమారునిన్ విగతజీవుని చేయు నగోచరమ్ములౌ
కరములు; హత్యయే ప్రథమ కారణమౌనో విలాస కేళికిన్.

ప్రకృతి యదృష్టశక్తిఁ దెలుపన్ బువు రేకుల నూరు తేనెపా
నకముల నెంతునా, త్రిభువనంబుల నిండు వెలుంగు నెంతునా,
సకల చరాచరాత్మక విశాలహృదంతరశక్తి నెంతునా,
యకట యశేష బాల్యమరణాదుల నే యెడఁదన్ దలంతునా.

## భిక్షావతి ౫.

ఆకలి... అబ్బ! ఆ పలుకు నందలి
యర్థ మెఱుంగ శక్యమే—
చీఁకటి గర్భ కోశమునఁ,
జిచ్చు శరీరమునందు, నాత్మకున్
శోకము, దుష్టచింతలకుఁజోటు,
అవినీతికిఁ బట్టుగొమ్మ, స్వా
ర్థాకృతి, ప్రేమహీనియును
సందుఁ గనంబడఁ జాల దీతయున్.

చచ్చినవారు రారది నిజమ్మయినన్ హృదయమ్ములోపలన్
జిచ్చులు వెట్టు సంగతులు జీవిత మంతయు నీడ పోలికన్
వచ్చును వెంట నెంత ధనవంతులకైనను; బీదలైనఁ బై
పెచ్చు క్షుధాగ్నికీల లొదవించు భయానక యాతనా శతుల్.

మాతృ దేవికి సర్వ సంపదలు కూడ
శిశువె, యా ప్రేమ ధనమె నశించె నేని
ఆమెకున్ వాంఛలెల్ల శూన్యంబు లగును;
కాని, యాకలి చిచ్చు కాంక్షలను పెంచు

వారము రోజులు నిద్రా
హారమ్ములు లేక రజని నైన బ్రతుకులోఁ
దీరని దుఃఖముఁ, బెల్లగు
నారాటము, బిచ్చకత్తె నవశ మొనర్చెన్.

అంత కంతకు నవశమ్ములైన యంగ
ములను శోకముద్రలు వీడి పోవ నెట్లొ
కడుపు దహియించు నాకలి నడచుకొనఁగఁ
గాంక్ష పొడమిన దాబిచ్చకత్తె కదలెను.

అగ్గలమ్మగు కోరిక నామె లేచి
ప్రాంతమునఁ గల తోటలోపల వసించు
భాగ్యశాలులు తన శోక భరిత గాథ
విని కరుణఁ జూతురనుకొని వెడలె నటకు.

అది మహాభవనమ్ము, విద్యు దసమాన
కాంతి గోళ దీపితము, నిరంతర ప్ర
మోద చిహ్నిత, మస్సరో మోహనంబు
లైన సంగీతములు వచ్చె నందునుండి.

ఆమోద సంవాసి తానేక సుమపూర్ణ
వల్లీ మతల్లికా వలయితమ్ము
వాతాయన వితాన భాసిత చిత్రమ
యయవనికా విశేషాంచితమ్ము
ఉపల వినిర్మితా త్యున్నత కుడ్య శి
ల్పమనోజ్ఞ నైపుణ్యాలంకృతమ్ము
నిరతవాసిత మంద మరుదంకు రానీత
పరిమళ మాధురీ సురభితమ్ము

ప్రాంత సంస్థిత ఘూర్ణిత వారిరాశి
శీకర పరంపరా శీతలీ కృతమ్ము
భోగభాగ్యాదికములకుఁ బుట్టినిల్లు
కనిన వారల నిల్పునా ఘన భవనము.

ఆ భవన మందు నాఁటి సాయంతనమున
నుత్సవం బేదో జరుగుచునుండెఁ, జలన
హేతు శకటముల్ బారులై యొసఁగె నచట
నతిథు లెల్లరు ధనవంతు లనుచుఁ జాట

ఆశ చివురెత్త, గొంతెత్తి, "అమ్మ, కడుపు
కాలి పోవుచునున్న దాకలికిఁ దాళఁ
జాల కున్నదాన నొకింత జాలి దలచి
పెట్టు డింతయన్నం" బని పెట్టెఁ గేక.

ఆ కేక స్వర్గమునఁ గల
లోకాధీశ్వరుని చెవులలో రాయివలెన్
సోకెనో, యొక్కక్షణమ్మున
నాకాశము నిండె నల్లనగు నంబుదముల్.

ఆ కేక లోన నిమిడిన
యాకలి చీఁకటులు లోకమంత యలమెనో
రాకాశశి బింబ మనో
జ్ఞాకారము కళలఁబాసి నట్లుగఁదోచెన్.

ఆ కేక వెడలి నంతనె
స్త్రీకంఠ స్వర మొకటి వచించె, "నెసఁఘురా,
చీకాకు తగిలి వేయుదు,
కేకలు వేసెదరు ముష్టికి, సమయ మిదియా."

ఆ యాజ్ఞ వినిన యంత వి
ధేయుండగు సేవకుం డతిరయంబున నెం
తో యేచ్చు నామె లక్ష్యము
సేయకయే, యవల కీడిచెన్ గళరంధ్రై.

జానెడు పొట్ట నిండుటకుఁ జాలిన యింత పదార్థమున్ గనన్
దీనత వాడవాడలఁ బ్రతిక్షణమున్ దిరుగాడుచున్న యీ
మానవకోటి యేడుపులు మంగళ వాద్యము లేమొ, భాగ్య భో
గానుభవ ప్రమత్తమగు నట్టి ధనాఢ్యుల జీవకేళికిన్.

"ఆఁకలిబ్రోవ 'నబ్బ' యనిన నెవ్వానికిఁ
గాముకు వీ" వటన్న నుడులు వోలె
'అమ్మ' యనిన యామె యాఁకలి కేకల
కేమును యెద కృప వహించఁ గలదు ?

మానవ కోటికిన్ దెలియు మంచియుఁ జెడ్డయు దైన సృష్టిలో
మానవుఁ డగ్రగణ్యుఁడను మాటలు స్వాప్నిక గాథ లౌను, వి
జ్ఞానము వృద్ధిపొందినను సర్వ మతంబులు నేకమైన, స్వా
ర్థానృత కాంచనాశ విడనాడని మానవు లుండు నంతకున్,

"మన" యనుమాటలో మెరయు మైత్రియుసోదర భావ మెన్న "నా"
యను నుడియందు నెల్లెసఁగు; నన్నిటఁ గూడను నైకమత్య మే
యొనసిన వేరవేర ధనతృష్ణకుఁ దావెటనుండి వచ్చు, నీ
ధనిక దరిద్రతా బహు విధంబులు నేగతిఁ గల్గు నెన్నఁగన్.

# భిక్షావతిఁ.

పుట్టిన నాఁడె పేదరికమున్
        గొని తెచ్చిర బీదవారు, మేల్
బట్టలు, మెత్త మెత్త నగు
        పాన్పుల, బంగరు గజ్జలన్, బువున్
దొట్లెల లోన, హాయిఁ
        దులతూగెడి వారలు, పుట్టినప్పుడే
పట్టుక వచ్చినార తమ
        భాగ్యము లన్నియుఁ జిత్ర మొన్నఁగన్.

అందఱు నేకదైవత దృగంచల దీపిత ధర్మదృష్టిలో
నందిరి జన్మమన్నపలు కారయ సత్యము కాదు, హాయి పెం
పొంద సుఖించునొక్కఁడు, మఱొక్కఁడు దైన్యతఁ బొట్టకూటి కా
క్రందనమున్ బొనర్చు, నిది రాక్షస ధర్మమ దైవధర్మమా?

పూవుల వాసనల్ మధురమోహన చంద్రకళా విలాసముల్
తావుల నీనుగాలు లమృతమ్మొలికించు వసంత వేళలున్
గేవల భాగ్యశాలులకె కేళివనమ్ములు కావు; సర్వ సా
మ్యావధి యైన యీప్రకృతి నారయ రేటికొ మూర్ఖమానవుల్.

ప్రాణికి గాలి నీరు
తిను వస్తువు లుండినఁ జాలు, సృష్టియే
వానిని దెచ్చియిచ్చు
తన ప్రాణుల కందరకున్ సమృద్ధిగా;
కాని నరాధముం డెవఁడో
కల్పన చేసె ధనంబటంచు, నీ
మానవకోటి స్వార్థ మను
మారణ యంత్రమునన్ నశింపగా.

ఒకడు సుఖంబుగా బ్రతికి యుండుటకున్ దగుదానికిన్ మహా
ధికమగు సంపదల్ కలిగి తింట మరొక్కఁడు చిన్నపొట్ట నిం
పుకొనఁగలేని పేదరికమున్ భరియించుట ఘోర దుష్ట సాం
ఘిక నియమంబు కాని భవ కిల్బిష పుణ్యఫలం బదెట్లగున్.

ఘోర తరమ్ములై వినుటకున్
  సహాయింపఁగ రానివెన్నో యా
చారము సంఘమన్ తెరల
  చాటున సాగుచునున్న, వింత యా
హారము లేక కష్టరీతికై
  మొదిమ్మోఁను తప్పు చేసినన్
దీరని మచ్చగాఁ బరిగణింతురు
  మా దురదృష్ట సంపదన్.

ఒక జనని గర్భమునఁ బుట్టి యున్న వారె
సోదర ప్రేమ గణియింప కుందు రిపుడు;
అట్టిచో విశ్వసౌదర్య మనెడు పలుకె
కేవ లాసత్యముగఁ బరికింప వలయు.

చుక్కల నవ్వులో వెలయు సొంపులు, వెన్నెల వెల్గులోనఁ బెం
పెక్కిన మాధురుల్, కుసుమ దృష్టుల సాగెడు వాసనల్ సుమీ
యక్కటికమ్ము, ప్రేమ, నిజ మయ్యవి శూన్యములైన యీధరన్
దిక్కు నెరుంగఁజాలని గతిన్ దిరుగాడెద మేము నిత్యమున్.

మానము, బుద్ధి, కోరికలు, మావలె మీకు నెసంగు, సుంతయున్
గానము హెచ్చుతగ్గులను; కాని ధనమ్మను పెద్దకొండపై
మీ నివసించు తావు, మరి మేము యధఃపథమందు నిత్యమున్
దీనత వీథులందుఁ బయనింతుము, చాలని పొట్టకూటికై.

మతము, సంఘ మాచారమన్ మాటలందు
నస్పృత, మవినీతి, భేషజ మనున వెల్ల
ముప్పిరిం గొని యున్నవి, ముష్టి కొరకు
పోవు మేము వానికిఁ జీడపురుగులమట !

ధనముగల మీకుఁ గోర్కెలు తగును కాని
బిచ్చగాండ్రమ మాకేల; వెలితియైన
సుఖము మరణమ్ములో మేము చూరగొనగ
వలయు, నాకలియే మాకు బ్రతుకు తెరువు.

కులము, నీతియు ధనములోఁ గలవు కాని
వర్తనమునందు నేమియు బయలు పడదు;
నాగరికత పెల్లైన యీనాఁటి వారి
మాటలివి, ఛీ, దరిద్రుల మాట లేల?

సభలలోఁ బుస్తకములలో సాటి లేని
విశ్వసోదర భావంబు విప్పి చెప్పి
మమ్ము గనినంత నీ కోతమాట లేల
కడుపు మాడిచి మముఁ జంప గడగనేల.

జీవుల నందరన్ బాడముఁ జేయుచుఁ బెంచుచుఁ జంపునట్టిడై
దేవుఁడొకండె యున్నయెడ ధీరుఁడు కాఁడొకొ పందయో కృపా
భావవిహీనుఁడో, యసురవైరుల చేబడెనో, మరేమొ, మా
ఈ విపరీత దుస్స్థితి గ్రహింపఁగఁ జాలఁ డొకింత యేనియున్.

సుమ పరిమళ భరితములౌ
రమణీయ వినోద మందిరములందున్ ని
త్యముఁ దిరుగు మీకు మా భా
గ్యము లబ్బినఁ దెలియు మేము కాంచు సుఖంబుల్.

కామ్యముఁబొంద నీతి బలిగా నొసరింతురు, కాసుకోసమై
గమ్యసుఖంబు వీడితిరుగన్ వెనుదీయ రొకింత; ఏగతిన్
రమ్య తరమ్ములై సకలరక్షణకున్ దగునట్టి శక్తులౌ
సామ్య పథమ్ములన్ దిరుగఁజాలెడ రీ దురదృష్ట మానవుల్.

దుర్భరమైన యీఁ బ్రతుకు త్రోపుడులన్ బడి తూలి పోవుచో
గర్భదరిద్రతా విలయ గాఢతమస్సులఁ గ్రుంగి పోదురో
నిర్భర సంపదున్నతుల నిల్చెదరో వచియింప లేరు, సం
దర్భము లేని యీ విధివిధాన మెరుంగఁగ లేరు మానవుల్.

తిండికి లేని మాకు వెలి తీయఁదలంపని సంఘమెల్ల మా
గుండెలలోన తీరకయె కూలిన యాకలి కోర్కెమంటలన్
మండి నశించు — మా యసువునన్ బ్రళయమ్ములై పుట్టు నింక
న్నండో వెలుంగు సర్వసుజనస్తుత సర్వసమత్వ చంద్రికల్.

ఆరనిమంటలై కడుపునందలి యాకలి రెచ్చిపోవఁగన్
దీరని శోకమై కడుపుతీపులు రంపపుఁగోత కోయఁగన్
దారుణ వేదనా విచలితమ్మగు గొంతున బిచ్చకత్తె గం
భీరముగా వచించె నొకపెట్టున నంతిమ శాపవాక్కులన్.

## భి క్షా వ తి. ౨.

తూరుపు దిక్కునన్ దొగరు
తోటలు పూయగ వెల్గురేడు వి
ప్పారె, శుభోదయం బని
ధనాఢ్యులు లేచిరి, యీదినం బెటుల్
తీరునటంచు భిక్షువులు
లేచిరి; ఆలయ వీధినుండి ఘం
టారవముల్ బయల్వెడలె
నాఁడొక పర్వమటంచుఁ జాటుచున్.

తూరుపు టింటిలోఁ దొగరు లేమావి చి
గుళ్ల తోరణములు కూర్చినారు,
పూఁదోట లోగిలిన్ ముత్తైదువలు మధు
స్వరమునఁ బాటలు పాడినారు,
మిన్ను పందిరికప్పు మీఁద లేవెన్నెల
వెలుఁగు దువ్వలువలు విప్పినారు,
గాలిదారుల చేత కప్పురపుం దుమా
రమ్మొకించుక విరజిమ్మినారు,

తమ్మి జవరాలు క్రొత్త యందములు మెరయఁ
బ్రియుని గన్గొను నాశుభ వేళయందు;
ఉదయలక్ష్మి వివాహముహూర్త మదియె,
సర్వసాక్షి కనులవిప్పు సమయమదియె.

వెలుఁగు వెల్లువల్ ఘడమ్మిపై విరియుచుండఁ
జీఁకటులు మటుమాయమ్మై చెదరిపోయె;
కాని కొందరి యెదలఁ జీకటులు నిండె,
కొందరి మనస్సులన్ వెలుంగులు నటించె.

## భి క్షా వ తి

ఒక్క చెట్టు కొమ్మలయందె యుద్భవించు
మొగ్గలందు నొక్కటి రాలిపోవు ధూళి,
మరియొకటి విచ్చి కురిపించుఁ బరిమళముల,
జీవిత రహస్య మెట్లు వచింపఁగలము.

పురమంతయుఁ గోలాహల
పరిపూరిత మయ్యె, జనులు పథముల యందున్
దిరుగాడుచు దమపనులన్
నెరవేరుచు కొనుచు నుండ్రి నిత్యము వోలెన్.

ఎవరి పనుల వారలే మున్గి యుండిరి
యొకరి యుబుసి కొకరి కుండమెట్లు;
యంత్రముల విధాన నందరుం దమ తమ
పనులఁ జక్కపెట్టుకొనుచు నుండ్రి.

జలధియందుఁ బుట్టి సాగెడు కెరటాలు
వోలె జనులు వచ్చి పోవుచుండ్రి;
పెండ్లివారి యింట వెలసెడు కోలాహ
లమ్మె నిండె పట్టణమ్మునందు.

లేరంగు మిలమిలల్ వెలిగ్రక్కు చీరలో
బిగువు దేహము క్రొత్త వింతఁ గురియ,
అతిసుకుమార పాదాంబుజంబుల నున్న
పాదరక్షలు నవ ప్రభల మెరయ,
చంచల లోచనాబ్జములకు స్నిగ్ధోప
నయనముల్ క్రొత్త యందములనీయ,
మెడ దిగువకు జారి మించు బంగరు గొలు
సతి దర్శనీయమై యమరుచుండ,

కనక కంకణముల్ ఘల్లుమనుచు మ్రోయ,
పుడమికిన్ దిగి మెరుపు పూబోడు లిట్లు
సాగుచున్నార లనగ బజారునందు
తిరుగు చుండిరి తరుణులు వెరపులేక.

శరవేగంబునఁ గారులున్ శకటముల్ సైకిళ్లు సాగన్ నిరం
తర భాఁభాఁ, టకుటిక్, కణక్వణన శబ్దంబుల్ బజారంతయున్
మొరసెన్ గొల్లున, నామహారవములో, మూర్ణాళ్లుగాఁ దాఁడియే
కరవై పోయిన బిచ్చకత్తె, మొర యేకర్ణంబులన్ జేరునో.

సంస్కార రహిత కేశంబులు విడి పీచు
పోలిక ముఖసీమ ముసుకు కొనఁగ,
అంగంబులన్ గప్ప నైనఁ జాలని చింకి
మురికిబట్ట శరీరమునఁ జెలంగ,
దొరకని తిండి కాతురపడు కన్నుల
లోతుల నీటి కాలువలు నిండ,
కరుణ చేకొనని యాకలి బీద కేకలఁ
గంఠస్వరంబు గద్గదిక వోవ,

వచ్చి పోవు వారలఁ జూచి బిచ్చమన్న
మంత్రము జపించుకొనుచు నా మార్గమందుఁ
దొలగి చనుచు భిక్షావతి నిలుచు చుండెఁ
దనువుఁ గొనిన దారిద్ర్యావతార మనఁగ.

ఆమె కనులయందు నాకలి మంటలే
మాతృరాగ మెచట మాటువడెనొ;
ఆమె యెడఁద నొకకొయారని కోరిక
కనుపు సింత తిండి కలుగు టెట్లు ?

ఏ మహాదుష్ట కరుణావిహీన సంఘ
మునకుఁ దనకుమారుని గోలుపోయి నదియొ
ఆ కఠిన సంఘమునె యింత యన్న మడుగు
కొనుట విపరీతమని యనుకొనియె నామె.

నిలువలేరా వీరు తళుకు మొఖమలు జ
రీ నిండు జోడు ధరించి కాని,
తిరుగలేరా వీరు శరవేగ వాయు వే
గాంచితంబగు కారునందు గాని
బ్రతుకలేరా వీరు పంచభక్ష్యపరమా
న్నంబులఁ బొట్టనిండ దిని కాని,
వెలికి రాజాలరా వీరు వన్నియల యం
దాల దువ్వాలువలు తాల్చి కాని,

సగముమంది యన్నము లేక చచ్చుచుండఁ
గొందరిట్లు హాయి నుండుట కూడునొక్కొ.
యనుచు నేవేవొ యనుకొననైన వలను
పడని భావము లామెకుఁ బొడముచుండె.

ఇపుడు రాచబాట కావలి దెసనుండి
ధర్మమూర్తి యొకఁ డుదారబుద్ధి
“అమ్మ, దీనిఁదీసుకొ” మ్మటంచున్ దీసి
కాణి యొకటి విసరె ఘల్లుమనఁగ.

గొప్పవారికినది యొక గ్రుడ్డి గవ్వ
బీదవారలకద్దియే వెండికొండ;
దానిచేకొందమన్న సంతసము లోనఁ
గలిగె నామెకుఁ బోయిన బలము చాల !

అది కనురెప్ప పాటునకు నైనను జాలని కాల మాత్ర మే
యెటునుండి వచ్చెనో, వలదహో యని యెందరు గొంతునెత్తి బె
ట్టిదముగఁ గేక వెట్టిరో, వడిన్ — కనులన్ మిరుమిట్లు గొల్పన —
ట్లదయతఁ బోయెనా శకటయంత్రము జీర్ణ తరంగపాళిపై !

# భిక్షాపతి. ౧.

భిక్షాపాత్రము ముక్కముక్కలయి యావిర్భావమున్ జెందెనో
యక్షయ్యం బగునట్టి చుక్క గమియై యాకాశ భాగంబునన్
వీక్షింపన్ బ్రతిరాత్రియున్ బుడమిపై వేచోటులన్ సాగు ని
ర్దాక్షిణ్యాత్మక సంపదంధుల మహా దౌష్ట్యాధికారంబులన్.

కాటుకపూత, రాతిరి మొగంబునఁ బూసియు, వెండి వెల్గులన్
మీటెడు చుక్కలేల యట నింపెనొ దేవుఁడు, జీవితమ్ములో
గాటపు దుఃఖమే కనులఁ గట్టుచునుండ వసించువారి కే
నాఁటికి నేన్ సుఖంబులు కనంబడు నంచునుఁ జాట నెంచితో ?

మిన్నులు వ్రాలుచోటఁ జిరుమిణ్కులు తోచియుఁ దోచనట్లుగా
నున్నది యొక్కచుక్క నులియున్ జిరుగాలికి యున్నయట్లు, తే
వన్నెలు సుంతసుంత తడబాటయిన ట్లగుపించు, నింతలో
నున్నది లేదటంచు నదియో యనుమానమె చూచువారికిన్.

ఎవరది సుప్రసన్న తరళేక్షణ పంక్తుల దిక్కులన్నియున్
ధవళముగా నొనర్చు తెలితార, నిలింప విలాసినీ స్మిత
చ్ఛవివలెఁ, బారిజాత సుమసంపద వోలెఁ దటిత్ప్రకాశమా
న విచికలమ్ముల వోలెఁ దెలినవ్వుల నీనుచునున్న దయ్యెడన్.

ఆ రమణీయతార హృదయంబునఁ గోరిక లెన్ని యున్నవో
భారములైన చూపులు, త్రపా చకితమ్ములు, కాంతితోడ వి
ప్పారగ దిక్కుదిక్కుల నొయారముగాఁ దిలకించు నేదియో
జారినవస్తువున్ వెదకు సంగతిఁ జీకటి చీలి పోవగన్.

ఆ తారా రమణీలలామ, మధురంబై నూత్న రాగాంచితం
బై తీక్ష్ణంబయి, తీవ్రభావ చలితంబై, యొప్పు దృష్టిన్ నిశీ
భీతిప్రాపక తామసీ పటలమున్ భిన్నంబుగాఁ జేయుచున్
జ్యోతిస్సంపద నిండఁ గన్గొనియె విద్యుద్వేగ మేపారఁగన్.

సుప్తిసుఖ సమాశ్లేషమున్ జూరగొన్న
లోకముల నెన్ని ప్రాణులులూకములటు
తిరుగుచుండునొ లెక్కింపఁ దరమె మనకు
ప్రకృతికిన్ విరుద్ధము మానవప్రవృత్తి.

నిదురించు నిల్లాలి యెదప్రక్క గుప్తమౌ
'పుస్తెలే' త్రెంచుక పోవువారు,
ఉపభర్త కౌగిలి నుండఁగాఁ బసిబిడ్డ
కనుకను వీడినఁ బీక కోయువారు,
అనుమాన పీడితులై, మానవతి యైన
సతిని దుర్మార్గులై చంపువారు,
బట్ట చాలక సిగ్గుపడుచునే "ముష్టెత్తు
కొను" స్త్రీలఁగని చెరగొనెడువారు,

తప్పత్రాగి మేను మరచి తాండవించు
వారు, దారితోపిడి చేయు వారు, కపట
వేషధారులు, నా రాత్రి వేళయందు
నెందరెందరో పడిరామె దృష్టియందు.

కదలి పోయినట్టి కష్టమయ స్వప్న
గాధ లేవో కనులఁ గట్టినట్లు
భయము చెంది, పుడమి వైపు చూచుటమాని
కనులఁ ద్రిప్పె స్వర్గమునకు నామె.

పారిజాత లతాంత వాసనా బంధుర
పథములన్ గీతికల్ పాడువారు,
కల్పవృక్షచ్ఛాయఁ గమలనాభునిఁ గూర్చి
సంతోషమునఁ బూజ సలుపువారు,
నందన వనవాటి యందుఁ బురాణమ్ము
లాలించుచున్ ముదం బందువారు,
గంగా తరంగ సంఘములందుఁ రాయంచ
లట్లు తేలుచు నీదులాడువారు,

భక్తిపరవశులై తాండవం బొనర్చు
వారు, వీరగీతంబులు పాడువారు,
సర్వసమ మత బుద్ధు లుత్సాహపూరి
తాత్ములున్ గనిపించినా రామెకచట.

అమ్మహానంద దృశ్యమ్ము లందుఁ గూడ
మనసు లేదయ్యె నామెకు; మరపురాని
పూర్వజన్మపుఁ బ్రేమలు ఫుల్లకుసుమ
దళములై తోచె నామె కన్నులకుముందు.

ఆ మొలమిన్కు తారక
దిగంతమునుండి యొకింత లేచి, యు
మ్మా యనిపిల్చె, నాపిలుపు
నందలి తీవ్రత యేమొ, చీఁకటుల్
పోయి నభంబునన్ వెలుగు
ప్రోవులు నిండె క్షణమ్ము మాత్రమే;
వాయువు క్రొత్త మల్లియల
వాసన నిండఁగ వీచె గప్పునన్.

తారకా లోకమున కలంకార మైన
వెలుగు వెల్లువల్ కురిపించు తళుకుతార
స్రుమని కాంతిఁ జిమ్ముచు జారిపోయి
యులఁతి పసిచుక్కతోడ నైక్యమ్ము బొందె.

# భిక్షావతి :: లఘుటీక

## ౧

క్షున్నివారణోచ్ఛ్రేకమె : ఆకలిని బాపుకొనుట యనే దుఃఖమే

జన్మసిద్ధి : పుట్టిన యోగము

దళితములు : భేదింపబడినవి

స్నిగ్ధమతుల్ : కరుణగలవారు

అలదురు : దుఃఖించు

భవము : పుట్టుక

విజ్ఞులు : తెలిసినవారు

అంగద : ఆకలి

పిచ్ఛలింప : అతిశయింప; ఎక్కువకాగా

ఆతపము : ఎండ; వేడి

ఉత్ఫుల్లము : బాగుగావిడినది

అక్కటికము : కరుణ

మృగతృష్ణ : ఎండమావులు

అవధి : మేర

అవసథము : గృహము

భూయిష్ఠము : ఎక్కువగా నిండియున్నది

సౌదర్యము : తోడబుట్టుతనము

కవోష్ణము : ఇంచుక వేడి

ఘస్రాంతము : దినాంతము; సంజ

౨

జృంభ : వికాసము,

ఆవిద్ధము : చక్కగా తొలువబడినది

అవిష్కృతము : ప్రకటితము

విశ్వస్త : విధవ

ప్రత్యహము : ప్రతిదినము

మాధ్వీకము : ఇప్పపూదేనె

౩

దరిద్రాణ : లేని

నిద్రాణతన్ : నిదురలో

అవగుంఠనము : ముసుగు

నృశంసుడు : క్రూరుడు

ఉద్ధతము : గర్వోన్నతమైన

ఆభీలము : భయంకరము

నైర్లజ్యాత్మ్యము : దిట్టతనము

ఆత్మావనము : స్వీయరక్షణము

ఔత్సుక్యమై . చేయబూనినదై

దృష్టము : చూడబడినది

౪

సూచీకోణాంచలభేద్యగాఢములు : సూదిమొనతో పొడువదగినంత దట్టమైనవి

నీరంధ్రము : సందు లేనిది

కకుబంతము : దిగంతము

అవిలంబితము : వడిగలది

ప్రస్థానము : ప్రయాణము

నిష్ఠ్యూతము : త్రోయబడినది

రంహశ్శక్తి : వేగముగలబలము

చామీకరము : బంగారు

చంచల : మెరుపు

ఉద్ధూతము : కదలింపబడినది

నిర్ఘాతము : పిడుగు

నిర్హ్రాదము : మ్రోంత

అదృష్టశక్తి : చూడబడనిశక్తి

౫

యవనిక : తెర

ఉపలము : రాయి

శీకరము : తుంపర

౬

కిల్బిషము : పాపము

భేషజము : వైద్యవేషము (మందు)

సామ్యపథము : సమత్వముగలదారి

౭

దువ్వలువ : వెలగలవస్త్రము

స్వర్ణోపనయనములు : బంగారుకళ్లజోడు

సంస్కార రహితము : చక్క చేయబడనిది

ఉదుట : వడి

బెట్టిదముగ : గట్టిగా

౮

నలియు : నలఁగు

నిలింపవిలాసిని : దేవతాసుందరి

విచికిలము : మల్లె

త్రప : సిగ్గు

ప్రవృత్తి : ప్రవర్తనము

ఫుల్లము : వికసించినది

అలఘి : అల్పము

# భిక్షావతి :: ప్రశ్నావళి

1. "భిక్షావతి" యను పదప్రయోగము "మానవతి" పదప్రయోగము వంటిదేనా ?

   "భిక్షావతి" కావ్యనామము సమర్థించుము.

2. సృష్టి, స్థితి లయములకు మానవధర్మమే మూలమని కవి యుద్దేశమా? ఎట్లు?

3. నేటిసాంఘిక పరిస్థితుల ప్రతిబింబమే "భిక్షావతి". నిరూపించుము

4. ఈక్రిందిప్రయోగములెట్లు సమర్థింతువు

   "ఏకాసి"; గులాబీకుసుమము; నిరంతర భాంభాం

   టకుటికి కణక్వణనశబ్దంబుల్; కాణి

5. "భిక్షావతి" పాత్రపోషణము సోదాహరణముగ వివరింపుము.

# BHIKSHAVATHI

BY VAJJHALA KALIDAS

PRICE

1-8-0

PRINTED AT

MODEL STATIONERY & PRINTING WORKS

SAKCHI — JAMSHEDPUR.

FOR COPIES

V. KALIDAS

Editor 'PRAVASI'

JAMSHEDPUR

( BIHAR )